# మైనాదేవి : మొరాకో కన్య

[ కావ్యద్వయి ]

△

అంబటిపూడి
వెంకటరత్నం.

△

విక్రమ
విజయ దశమి.



అం. వెంకటరత్నం (రచయిత): సి. వెం. రా. ల. నరసింహారావు.

ఈ నా రచనలను వినియు చదివియు ఆనందించి వీటి ప్రచురణకు నా కన్ని విధాలా సహాయమై ప్రోత్సహించిన మిత్రులు— శ్రీ సిరిప్రగడ వెంకటరామ లక్ష్మీనరసింహా రావు (దేశపాండ్యా సిరిదేపల్లి నైజాం) గారికి - నా కృతజ్ఞత.

ఇట్లు,
అం. వెం.

ఆంధ్రభాషాయోషకు ప్రతి తెలుగుబిడ్డ డొనర్చు సేవయును విధియే యగుటచే నా చేసినది గణనీయము కాకున్నను దాని కొక ప్రాధాన్యత నిచ్చి అజ్ఞాతముగా నుండనీయక తన కృతితోపాటు ఆంధ్రపాఠకలోకవిహారమునకు యోగ్యతగలదానినిగా కల్పించిన మిత్రులు— శ్రీ అంబటిపూడి వెంకటరత్నం (అగ్రహారీకులు ఏదుబాడు అగ్రహారం గుంటూరు జిల్లా) గారికి- నా కృతజ్ఞతాభివాదములు.

ఇట్లు,
సి. వెం.

"ఎచ్చోట మనస్సు నిర్భయంగా ఉండగలుగుతుందో,
తల ఠీవిగా ఎత్తబడుతుందో;
ఎక్కడ జ్ఞానం విచ్చలవిడిగా లభ్యమౌతుందో;
ఏ కడ లోకం కుటుంబభిత్తి కలచే భిన్నభిన్నంగా
ముక్కలు చేయబడదో;
ఏ సీమ వాక్కులు సత్యాగాధంనుండి వెలువడతవో;
ఏ వాడ విసుగులేని కృషి పూర్ణత వైపు
చేతులెత్తుతుందో;
ఏ ప్రదేశాన నిర్మలహేతులహరి అభ్యాసమనబడే
భయంకరపు ఎడారిఇసుకలో మార్గభ్రష్టం కాదో;
ఏ వీధి మనస్సు నిత్యవిస్తృతినొందే సంకల్ప కర్మలలోనికి
నీచేత ముందుకు ముందుకు నడపింపబడుతుందో –
అట్టి స్వాతంత్ర్యస్వర్గధామంలో ప్రవేశించడానికి
తండ్రీ! నాదేశం ఉద్బుద్ధమౌగాక!"

రవీంద్రనాథ టాగోరు.

'చిత్రమయజగత్తు' నుండి అనువదింపబడి 'సుజాత' తెలుగు మాసపత్రికయొక్క ప్రభవ మాఘమాసపు సంచికలో శ్రీ. జి. వెంకోబరావు గారిచే ప్రకటింప బడిన 'కళంకము' అను కథ యీ రచన కాధారమగుట వారికి నా కృతజ్ఞత.

ఇందలి చారిత్రకాంశములన్నియు - సర్ థామస్ హే డైరీ నుండియు, టైమ్సు పత్రికా ౬ సెప్టెంబర్ ౧౮౫౭ నుండియు, ౧౦ సెప్టెంబర్ ౧౮౫౭ "హరకారా" ఆధారము నుండియు గ్రహింపబడిన వగుట విశేషము.

పద్యకావ్యము గాన తదనుకూలముగ మెలిచిన నా మెలుపులు బుధుల ఆదరణకు పాత్రములనియే నా విశ్వాసము.

విదులు తగిన మార్పులను సూచించుచో విధేయుడనై స్వీకరింతును.

# పూర్వమ్.

“ విమలహిమాలయోద్భవప
విత్రధునీ! జననీ! నుతింతు సి
న్నమరతరంగిణీ! కలుష
హారిణి! జహ్నుసుతా! భవత్కథా
సుమమకరందగంధముల
జొక్కియు నీకు జోహారు లీయ రే
కుమతులు వారికే గతులు
గూర్పఁ దలంచితివే వియన్నదీ?”

అని యశ్వమేధఘట్టము
న నిమజ్జన మాచరించి నయగాగతనం
బున రామపాలసింహుం
డనిమిషులకు దగిన పూజ లట సల్పు నెడన్

వినబడె భారతీస్తుతిని-
వేదసగీతి, యొడల్ గగుర్పె. చు
ట్టును దిలకించె గాని యెవ
డున్ గనుపట్టడు. నిమ్నగాతటం
బున తనసేన నిల్చుదెస
బోవుచు నాగె. జటల్ ధరించి భూ
తిని తనువెల్ల నింపి జల
తీరమునం దొక యోగి సాశ్రుడై

" జయ వీరభారతీ
జయ విశ్వభారతీ
జయ దివ్యవిజ్ఞాన
విపులశోభావతీ !

మైనాదేవి

జయజయ శ్రీవేణికార్ద్రితేజోవతీ
జయజయ స్వప్రజానందగీతావతీ
జయ నిఖిలభువనతలమణి వీరభారతీ
జయ భావిభాగ్యగర్భిణి విశ్వభారతీ

జయ వీరభారతీ
జయ విశ్వభారతీ
జయ దివ్యవిజ్ఞాన
విపులశోభావతీ ! ''

ఇటు లాపాదశిరంబు నెత్తురుటు వే
డెత్తగ గభీరార్ద్రిని
స్ఫుటనాదంబున వేదనామధువు ను
ర్వ్యాల్ దేల పొంగించి పా
డుట చాలించెను కన్గవగ్ దెఱచి పో
టుంబంటు వీక్షించి 'ర
మ్మిటు పుత్రీ' యన వచ్చి మొక్కి పృతనా
ధీశాను దీవించియుగ్

" తనయ ! ఈ చేయుపయన మెందాక ?- ఏమి -
ఏమి - కాన్పూరుపలు కందు వేమి పనులు "
అని సటాచ్ఛట వింతగ వెను విదల్చి
యడుగ నిశ్శంకుడై వీరుడనియె నిటుల

" స్వామీ ! హూణుల కేరు సాయపడు
వ్యాపారిక్, సిపాయీలు తుల్
క్షామం బొందకముందె ధాన్యము పదా
ర్థవాశితముక్ గూర్చ నా
కో మానీశ్వర ! బాధ్యతల్ గలవు
ఈ ఒంటింపు పంజాబునం
దై మేలమ్యెను పుట్టినిల్లదియె ఆర్యా
కాని కాన్పూరులో

ఆంగిలేయబలంబు లాహోరమునకె
వాచి మలమలమాడెడి వార్త తెలిసి
వలయు సామగ్రి గూర్చ నా పనియె యగుట
హనుమన్మైనిని తనయ నొప్పుదు మహాత్మ ! "

 మైనా దేవి

" బూటకముల్ వచించుటకు
పుట్టిమునింగిన దేమి వత్స? యీ
పాటికి నాల్గు మాత్రమె ది
నమ్ములముం దట నుంటి నేను; ఏ
కాటుక ముండ దచ్చట, సు
ఖమ్ముగనుండె బలమ్ము లెల్ల, నీ
మాట నిజమ్ము కాదను వి
మర్త్యులు నాకవిసోల పొమ్మికన్ "

అనెడి జడదారినుడి సందియమ్ము గొలుప -
'కాదు తపసి నిజమ్ముగా కొడిలేందు
ఐనచో నీతనికి సేనలందు గలుగు
కష్ట సుఖములపై నింత దృష్టి రోల '

అని తలపోసి వీరుడు " మ
హాశయ ! కోపము కల్గకున్నచో
మనవి యొకండు సేతు " నన
" మంచిది పల్కుము భీతి నీకు మో

తనయ'' యనంగ యోగి. ''గృహ
దారలపై మమకార మేద నీ
మునిజనవృత్తిలో దిగిన
మూర్తముపో నిపు డెంత కాలమా

పుట్టిన దే పురంబు విన
బుద్ధి యగుŋ మహనీయ !'' యన్న
నా ిట్టిని జూచి తాపసుడు
'' శిష్యుడ ! మాసిగ మారు టెల్ల
చేపట్టిన కార్యమందున న
పారఫలంబును బొందగోరి,
యీ దిట్టతనంబుతో ఫలము
తేలిననాడు గృహస్థునే సుమా !

ఇట్టు లేనయి గడవలే దెన్నో నాళ్లు
నాది విఠ్ఠలపుర'' మని నట్టు సేయ
రామపాలుని సంశయరాజి పెరిగి
మెుటి జడదారితో పల్కెనిట్టు లతడు

" ఈ రోజుల్ కడు తీవ్రమైనవి వీరా
గీ! హూణ వైరుధ్యమం
దే రాష్ట్రింబున నింతో యంతో విపరీ
తేచ్ఛాప్రచారంబులే
మేరల్ మీరి పెరుంగుచున్న వికసీ
మేకోలు శంకాస్పదం
బై రాజ్యాంగవిరోధి యీతడను నూ
హాల్ గల్గుటల్ చోద్యమే "

ఎప్పుడిట్టి నుడుల్ చెవి కెక్కెనపుడె
తబిసి మనసు ముహుర్ముహుస్తప్త మగుట
నతడు నిలబడి నిశితేక్షణముల బరపి
వీరవరు మందలించి గంభీరుడగుచు

" నాయెడ సందియమ్మగొను
నర్మిలి జూడగ నీవదేమొ ఆం
గ్లేయుల గుప్తశోధకవ -
రేణ్యుడవం చనుమాన ముద్భవం

బై యెద నూచుచున్న దిక
నయ్యెడి దేమియొ కాకపోదు నే
నీయెడ జెప్పగా దగిన
దెద్దియొ దాని వచించి తీరెదన్

వెండిబంగరుటిండ్లు వీడి వచ్చిన నదీ
కాంతలు విహరించు కనకభూమి
ఘోరాటవిన్ లేటికూనకు పులివద్ద
పాలు ద్రావించిన బ్రహ్మభూమి
చెఱుగును ద్రుంచ నుంచికి బావుటా నెత్తి
తనువు లర్పించిన ధర్మభూమి
తోడి దేశములు కన్దోయి విప్పని వేళ
నర్తించి కలికిన నాకభూమి
ఇది భరతభూమి నీ పుణ్య మెదియొ పండి
భారతీయుడ వైతివి ఫల మదేమి
జనని నర్చింతువో లేక జన్మభూమి
కెదురుగా నిల్చి కత్తి నెత్తెదవో నేను

ఒక జీవి నూతనా నొంది యీ తని కథ
కల్లి పేదగ నిల్చి నదియు గాక
ఏ మతి కింపీత మ్మే పథమ్మో దాని
తీర్చి యీయగలేని దేవి కాక
మనచేయు నిత్యకర్మలకు దూరమ్ముగా
నిలచి భీషణదృష్టిగలది కాక
అణువాది బ్రహ్మపర్యంతము మనదగు
రీతి జెప్పగలేని ప్రేత కాక
పరమపావనసూత్రసంబద్ధమైన
దార్యధర్మము నీరక్త మార్యదత్త
మెట్టి బాంధవ్యమో చెప్పనేల తిరిగి
తల్లి గర్భమ్ము గోయు పుత్రకు డెవండొ

తోడబుట్టిన వారి మైత్రోళ్లు లొలిచి
పరుల కాళ్లకు చెప్పు లప్పనము గాగ
తొడిగి ముద్దాడి కండల గుడున బెట్టు
వారిత నీ తల గలదా నిల్వకుము పొమ్ము. ''

ఢాకాబొమ్మలు కదలి గర్జనము జేసి
కర్మభూమికి కంకణాఘంటికలను
దాల్చి రాగల వీరబోధనము సలిపి
పుత్రధర్మంబు సూదుల బొడిచి చెప్పి
అరిగె నా యోగి తెలియ దే యంకమునకొ

ఒంటిగ నున్న వీరవరు
డల్లము తల్లడ మంద పెల్లు నా
వంటి ఖలుండు లేడని వి
భంజితుడై తపియించి గుర్తురా
బంటుల జేరి స్వీయపరి
వారముతో పయనించె గాని వె
న్వెంటనె యోగి యున్నటుల
వేయి తలంపుల గ్రుక్కుచుం జనెం

చని కాన్పూరున హేదొరం గలసి ప్ర
స్తావింప నాతండు "వారి
సైను కాన్పూరిం గిది చూడుమో వినయరా
శీ!" యంచు వే నొక్క లే

ఘను జూపింపగ కేల నంది
వ్రతభంగం బొందు తేజస్విహృ
ద్వనజం బట్లు తపించియుఁ దిరిగి ప
త్రంబందు నీక్షించుచుఁ

— లేఖ —

" పరదారా మన గ్రామపాలనకు ని
స్సందేహానై తెల్పు ' మె
వ్వరు నేరం బొనరింతు రా ప్రజా వ్యా
పారంబులందెల్ల తీ
వరమౌ నేరుపు జూపి వర్తిల ' గ —
ఎవ్వారైన మీరెల్ల రే
పరగా దిత్తులటి రేపో మాపో సానితో
మాత్సర్యసంఫుల్లుడై

పోరు సలుపగ విఠ్ఠలపురనివాసి
నానాసాహెబు కత్తిచే బూని వచ్చు
నను వదంతులు పెల్లు రేగినవి కాన
తెలివితేటలతో నుండవలెను సుమ్ము "

అని పరికించి విఠ్ఠలపు
రాఖ్య గనంబడ విభ్రమంబు పై
కొన దలచె " ఘనీతలిని
గూడిన యోగి యతండె కాడె 'నే
మునియగు నొక్క కార్యమున
పూర్ణఫలంబును బొందగోరి ' యం
చనియె నతండు కానలయు
నాతడు నిక్కము నానసాహెబే "

*

ఏ దిన మెట్టినో యెవరి
కే ఫల మిచ్చునో కాలనేత
దే వాదము సేసినఁ దన వి
వాదము నెగ్గడి తీర్పు సేయు కా
రాదని లేదు నోరెరుగ
రాని దచేతన మిద్ది చేతనం
బీ దినుసన్న భేద మెద
నించుక చింత యొనర్ప దక్కటా!

ఆ దివ్యసౌధ మే యసమాన శిల్పి చే
తుల తీరుపొంది మెప్పులను గనెనో
ఆ భవ్యహర్మ్య మే యధిక వాంఛావల్లి
కని పెంచుకొన్న బంగరుసుమమ్మొ
ఆ పుణ్యభవనకళ్యాణ శీతచ్ఛాయ
లం దెంత లోక మానంద మొందె
ఆ పావననికేతనాంతఃపురీవాటి
తనిపె నెన్నెన్ని సౌందర్యలతల
ఆ యనర్ఘంపు సదన మే యఘ మొనర్చె
కాన్పురమ్మున మనికియే కలుష మేమొ
నానసాహెబు దగుట ఆనాడు దోసగొ
గుండె లిచ్చెగదా ఫిరంగులకు మేడ !

అది యచేతనమయ్యు నాత్మాభిమాన
మింత నిలబెట్టుకో ధన మెంత యొసగె
కనికరములేని పరుల కర్కశపు వ్రేటు
లెన్ని యెన్ని ! తనుచ్యుతి నేది దిక్కు ?

మానిని జాడ లేదనిన
మందిర మప్పు డుదారమాళిభా
గాన ధరించి చూపినది
కాంచనమంజులగాత్రవల్లరిన్
మానిని నొక్క కన్నియ న
మాయిక నాత్మజ నట్టు: లే
మాను నరాత్మ లా గడియ
యందు గరంగక కక్కసించుచో?

నిల్చునక ప్రేలు తోపులు వి
నీవినకుండిరో సైనికుల్ వ్యథా
కులమతియై కుమారి 'తుటి
కోపము నాపగలేరె' యన్న వా
క్కుల; నొక కొంత సేపటికి
క్రూరత సిల్పి చమూనియంత 'హేం'
కలికి సమీపముం జని ప్ర
కంపితుడయ్యె స్మరించి దేనినో

అప్పు డా బాలిక నోట తేనియల చా
ఱ్ఱ శుద్ధహూణంబు జా
లు పడఁగ భాషణసేసె 'కారుణిక ! నీ
రుల్ మీరు యీ మేడపై
కృప కించిత్తు వహించి కావగలరా
కీర్తింతు మీ పుణ్య' మ
న్న 'పడంతీ! భవనంపు రక్షణముపై
నగ వాంఛ నీ కే' మనగ

"భవన నిర్మూలనము బుధవర్య మీకు
కాంక్షితం బెట్టు లాయె నా కారణమ్ము
మీరె సెలవింపు మొద" లని మూరుపలుకు
బాలికను గాంచి స్నేహదార పలికె నిటుల

"-రాజవిద్రోహులై కుట్ర రగులు కొలువు
నానసాహెబు భవనచిహ్నము జగాన
అణువు లేకుండ చదును జేయంగవలయు -
ననెడి ప్రభుశాసనములు కారణము బాల!"

" ఇదియా కారణధర్మ మార్యవర ! మీ
కెవ్వాడు విద్వేషివై
కదలేక ఖడ్గము బూని యాత డగు శి
క్షాపాత్రు డేమైన, నీ
సదనం బౌర జడంబు; ద్రోహి కిడు శి
క్షల్ దీనికా సౌమ్య ? నా
హృదయం బిచ్చిన దీ పవిత్రతల మే
నూహించు స్వర్గ మ్మదే.

ఈ యింట పసిపాపనై అమ్మబొమ్మపాల్
జీకి నేర్చితి నేను చిఱుతనగవు
ఈ నేల పారాడి యింత యడుగిడ నేర్చి
గిలుకుటందియల చిందులిడ లేదె
ఈ గూటిసీడ నాకెన్ని రేలు పవళ్లు
తనువోడి బ్రతుకు సత్కవుల గోష్ఠి
ఈ గవాక్షములు నా కెన్ని బొమ్మలు చూపి
చదివించె గగనపుస్తకపు పుటల

ఇచట ప్రతి రేణువును ప్రాణమిచ్చి నన్ను
పెంచి పెద్దగ జేసిన వీరమాత
కృప వహించవా ఆత్మ వెల్గించుకొనవా
నా యెడలు కాల్చి నిలుపు మన్నా! గృహమ్ము

" బాలా! చేయగరాని పాతకము నా
పాల్ జిక్కె నేమందు. బా
ధాలీనమ్మయి నా హృదంతరము సం
తాపించు సంతాప మం
తే లేకున్నది విశ్వసింపుము : మదీ
యేష్టంబు రాజాజ్ఞకుగ్
కేలుండోయిని మోడ్చి పోవలయు సం
గీకార మున్నట్టులే "

" ఈ సకలమ్ము సైన్యమున
కీ వధినేత వెరుంగుదుగ్ యశో
భాసుర ! పేరు హేందార- అ
బద్ధమె ? నీ ప్రియపుత్రి 'మేరి' సా

 మైనాదే

వాసము నాడు నన్ను గని
' బాలిక ! నీ వాక చిన్న మేరి, వా
యాసము తీఱు నిన్ను గని
నంత ' నటంచును గుస్తు దప్పెనే

ఇది యొక లేఖ మేరి లిఖి
యించిన, దిప్పటి కప్పుడే చనెన్
పదపడి యోండ్లు మూ; డపుడు
పల్కెను ' చెల్లెల ! తండ్రిగారికిన్
ముద మొదవించు దీని నిడి
పున్నెము బొందు ' మటంచు - నిట్టి యా
పదపయి దీయ గావలసి
వచ్చెను ప్రాణసఖీస్మృతి స్మృతిన్ "

అని యా బాల వచించు వైఖరి క్రమ
వ్యాఘాతమై వాని నె
మ్మనమున్ గాయము జేసి, పోయిన సుతా
మంజూషలో నిండి వె

ల్గిన మాణిక్యవిలాసముల్ స్మృతికి గీ
లించెన్; త్రుటుల్ సాగిపో
యిన లక్షింప డతండు; కొంత తడవ
య్యెన్ బల్కె నీ రీతిగన్

" నానాసాహెబు కేకపుత్రికవు మై
నా! నీవు మా మేరియున్
ఏ నేస్తంబున నాడి పాడితిరొ హా
యిన్ గూర్చు నా రోజు లా
రా నా జన్మకు చూడబోను: కనులా
రన్ దాని చేవ్రాతలో
నైనన్ ముచ్చట జూచి కానుకలు గా
నర్పింతు నే బాష్పముల్ "

అని కే లెత్తిన వాని కందునటు లా
హర్మ్యాగ్రమం దుండి లే
ఖను చేజారిచి వైచె నామె: అతిశ
క్త్యంతన్ విడన్ దీసి యా

గని కన్నీటిని గోట మీటి చదువం
గా లోని సందేశ మే
మని తీర్చంగల డెట్టు లాగగల డం
త్యాకాంక్షయే పుత్రికిన్ !

— మేరి లేఖ —

“ నా చెలియ నాదు ప్రాణము నా సమస్త
జీవనమ్ముగ దనరిన చిన్న మేరి
కాపద తటస్థమైనట్టు లరయ దేని
కావ్ర మో తండ్రి యిది నాదు కడమ కోర్కె ”

ఉన్న యొక బిడ్డ ప్రాణమ్ము గోడి చనుచు
చేతనో రార కోరిన లిప్స యొకట
చండదుర్వారఘోర శాసనము లిడిన
కార్యభారమ్ము గుండెలో కలచు నొకట

పొత్తు కుదరని ఈ రెండు పోకడలను
దేని విడనాడుటో మరి దేని బొందు
టో విధింపగలేక నానావితర్క
సంకులాత్ముడు నలిగి బాష్పములు విడుచు

జనర 'తాటా్రిము' అప్పు డచ్చటికి రాగ
'హే' సమస్తము వచియించి విధిగ బలికె
"ఏది యెటులైన నానసాహెబు గృహమ్ము
భగ్నమై పోనియట్లు కాపాడవలయు"

" కానే కాదిది సోదరా ! బహుళగుః
ఖస్యంది యీ కార్య, మా
నానాసాహెబుపై ప్రభుత్వము ప్రచం
డక్రోధమున్ బూని లేదో-
నీ విద్ది యెరుంగవో - ప్రబలవి
ద్రోహుల్ సుహా వీర లా
నానా పక్షము వారలే - యనెడి నిం
దన్ మోపి శిక్షింపదే !

ఆతడే కాదు ' ఆతని యన్వయమ్ము
సర్వ మీనాడు రాజశాసనము లోని
కోపవిలయాగ్నిశిఖలలో గూలవలెను:
మనకు పునరాజ్ఞ లేనిదే మాన్పగలమె ? "

" ఔను చెలికాడ! పునరాజ్ఞ నందవలెను
దానికొఱ కిప్పుడే వేగ తంతివార్త
ప్రభువు క్యానింగునకు బంపవలయు, నాత
డంపు వార్తను గన కుద్యమింపరాదు."

" ఓయి! నీ మతి కెయ్యది యోగ్యమనుచు
తోఁచునో నీవు పొమ్మట్టి త్రోవవెంట
నేను మాత్రము పోయి మైనాను పట్టి
యీడ్చుకొనిరాక మాన నీవేమి యన్న."

" కట్టా! నే వినజాల నింతటి పనిన్
కారుణ్యమున్ వీడి నే
నెట్టుల్ జేయగ నోర్తు, బిడ్డ నటు నా
యిందుస్ఫురద్బింబమున్
పట్టీ యంచు కవుంగిలించితిని. ఆ
బంధమ్ము ప్రేమాత్మకం,
బెట్టుల్ ద్రెంతును? తంతి నంపెదను; నీ
యిష్టమ్ము ఈ లోపలన్ —"

అని బహులు పల్కి ఔట్రాము నాత్మనిశ్చ
యమును మైనాకు వినిపించి యచటు బాసి
తంతి నంపగ హేం జనె నింతలోన
నిచట ఔట్రాము తనపట్టు నింత విడక

కాలవ్యాళముపోల్కి బుస్సుమనుచున్
కాల్ దువ్వి ఋషుంబబుల్
తోలెన్ బంటుల మేడలోపలకు; భ
ల్లూకంబు ల ట్లా భటుల్
గాలింపన్ గృహ మెల్ల నాల్గు దెసలన్
గన్పింప దా బాల. 'ఔరా !
లే, దెచ్చట కేగె చిత్ర' మని వా
రాశ్చర్యమూఢాత్ములై

వెతకిన మూలనే మరల
వే యొక నూ ర్వెతకంగ బోను, రే
వితమున నైన జాడ కను
పింపదు: ఒక్కడికొక్కనిస్ గదుర్

వెతగొని పృచ్ఛసేయును- 'ల
భించెనె బాల!' యటంచు- నాత- 'డే
గతి లభియించురా' యనుచు
కన్యకునై వెదకుఁ బదే పదే.

కంటబడిన భటాళిపై కన్ను లెఱ్ఱ
జేసి కోపించి గర్జించి ఛీ యటంచు
జనర లౌత్రాము పిచ్చి యెత్తిన విధాన
సంచరిలు: నింక కలదొక్క జాము పగలు

ప్రభువు క్యానింగు హేదొర వార్త జూచి
తిరిగి పంపిన తంతి అందినది యపుడు,
పత్ర మిర్వురు సేనాధిపతులు గలిసి
సంభ్రమము తోడ విడదీసి చదివి రిటుల

— క్యానింగు పంపిన తంతి —

"అచట నింగ్లాండులో మంత్రు లంద రొక్క-
కూటమిగ తీర్పు జేసిన మాట వినుము
తిరుగు లేదందు పాలించి తీరవలెను
ఘోర మందువా క్షమియింప గోరువాడ.

' అపర్ణ ఎచ్చటనేని వాని స్మృతిచి
హ్నం బుండగా రాదు త
ద్భవు లెవ్వారును ప్రాణవాయువుల సి
ల్పర్ రాదు నానాది యం
చవర్ణ చేతనమే నచేతనమై
సన్ బేరులేకుండ మా
య వలెన్ ఎట్టి పదార్థమైన, నివి మా
యాజ్ఞల్ అనివార్యముల్."

చటుల విలయోర్మిసంకుల సంగరాబ్ధి
నుఱుకటకు ముందు తా నేగ నుత్సహించు
నాడు హే, నేడు మహారాష్ట్రబాల నొక్క
దాని బంధింప సందేహ మూను నార!

వినుచునె కంపమొంది దుర
పిల్లుచు లోననె దుఃఖ మాపుకో
జనియు నశక్తుడై గృహము
చల్లగ వీడి యొకింత దూరమం

మన పరిదేవనాచలిత
దుర్బలచిత్తుడు కూరుచుండె హే
రన నికముందు కాగలుగు
కార్యము లెట్టివో యన్న చింతతోన్

సేనాపతి ఔట్రాముడు
నానాభవనమ్ము నపుడు నాలుగు దెసలన్
పూసికమై భువి గూల్పగ
సేనను బురికొల్పె నంత చింతయు లేకన్

మైనాపుత్రి కృపాస్యయై వెలయు హ
ర్మ్యశ్రీకి దీర్ఘాయువం
బానాడే పరిపూర్ణమై కరిపక్ష
గ్రాఘాతజాతవ్యథన్
శ్రీ నిర్వేదము నొందెనా వినగ దో
చెన్ శీర్ణభాగమ్ములై
నోర్నేలం బడు వేళ: ఆర్తరుతు లై
నోర్మృత్యుభీత్యంకముల్ !

ముక్కలు ముక్కలై పడిన
ముద్దుల మేడ పొడల్ హరించి పో
రక్కసిబంటు లప్పు డన
లమ్ము రగిల్చి జ్వాలచ్ఛిఖాళిలో
చక్కని సౌధఖండికల
చావక నిల్చిన శిల్పచాతురీ
దృక్కుల లాగువాని బడ
ద్రోసిరి వ్రేల్చిరి భస్మమౌనటుల్

ఆవల నున్న శౌదార భ
యభ్రమ లెల్ల నతిక్రమించి యూ
హావృతుడై చరించు భయ
దాటవులందొ బిలయాగ్నియందొ దు
ర్దావయుతాగ్నిభీకరత
రంగములందలి సంధులందొ యే
త్రోవనొ కాసి నేత్రములు
తొల్గక చూచె కఠోరదృశ్యముల్

 మైనాద్రైని

చూచి కడ కాత డొల్కు సశ్రువ్రులతోడ
''అబ్బ! నే నేల కంటి నీ యసురకృత్య
మిది మరువజాల ప్రాణమ్ము లేగుదాక ''
యని తనను తాను భాషించుకొనుచు జనియె.

*

నాడు షోడశకళల పూర్ణముగ వెల్గు
పండు చందురు నాటంకపరుప నొక్క-
మబ్బుతునకైన లేని నిర్మలవియత్తు
నిద్రితజగత్తు తళుకు వెన్నెల నలందె

ఆ నడికి రేయి తెలివెల్గు లీను వలిప
మొందు ధరియించి ముద్దు నెమ్మొగములోన
వగపుచీకట్లు తాండవింపగ నలంగు
పదియునారేండ్ల మహారాష్ట్ర బాల యొకతె



మైనా దేవి

మంటలకు మాఱుమసలి గొంతొంటి సంటు
కొసియు పొగచూరి నల్లనై కూలియున్న
శిథిలసదనంపు కుడ్యావశిష్ట శిలల
నడుమగల బూదిలో రోదనమ్ము సేయు

బంటు తొట్రాము–నాయకత్వమున మెలగు
వారు విడిసిన చో టెంతో దూరమందు
లే దటకు, గాన బాలికా రోదనమ్ము
వారి మేల్కొల్పి యబ్బుర పడగ జేసె

" ఈ యపరాత్రిరి నెవ్వరో
'ఓ' యని యేడ్చెదరు, కంఠ మువిదది సుమ్మా
పోయి కనవలె నెవరో
యాయమ" యని కొండ తేగి రందలి బంటుల్

కలువ కందము దిద్దు కన్నె కన్నులలోన
దాగున్న దే చిమ్మ రేగు కడలి.
నిండు వెన్నెలజేని నిరసించు ముద్దు మో
మున మ్రోగునే యేడు పనెడి మొయిలు

తళుకు బంగరు కింత కళ లేదె యనిపించు
చిరుమేని వాడ్చెనే చెనటి వనట
పుడమి సొమ్ముగ పేరు బడిన నవ్వుల మొగ్గ
కబ్బబ్బ తగిలెనే దెబ్బ ఎంతొ
అంత చక్కని తల్లి కా యింత చిరుత
యీడు లోపలనే భరియింపరాని
దుఃఖభారమ్ము నా యను తోడులేని
దిక్కుమాలినతన మ్మక్కటక్కటకట!

ఒక గుప్పె డచటి బూది కరమ్ముతో దీసి
యెద కొత్తుకొను జనయిత్రి యనుచు
ఒక పట్టె డచటి బూది కరమ్ముతో దీసి
తల రుద్దుకొనును నా తల్లి యనుచు
అట నింత బూది దోయిట బట్టి కన్నీట
దడుపుచు నా స్వర్గతలము యనును
తల నేలపై బూది దగుల నట్టిట్టు దొర్ల
వైచి పోయితె కాణాచి యనును

పసిడి యొడలెల్ల బూదిలో బడిన బొప్ప
వర్షమునసైన యడుసున బడుచు పొరలు
చర్మ మలీమస మైనంత సొంపుచెడిన
పిచ్చి వేషమ్ములో నవ్వ వెర్రితల్లి

బంటు లా తల్లి నెన్నెన్నొ ప్రశ్న లడిగి
బదులు లేకుంట స్తోత్రాము పాలి కరిగి
తెలియ జేయగ నాత డా దెసకు వచ్చి
చూచి యిది నానసాహెబు సుతయె యనుచు
నిర్ణయ మొనర్చి పట్టి బంధింప బోవ-

"అన్నా! మ్రొక్కెద - తాళు - మీ యనద నా
యాసింప బో కిప్పుడే——
అన్నన్నా! నను గన్న దేవళము - నా
యానంద వైకుంఠ మే
మున్నై పోయిన, దింక నా బ్రతుకు నే
శూన్యమ్ము: మున్నీరుగా
కన్నీ రొల్కగ నేడ్చి వచ్చెద - త్వరన్
గావింప కో పుణ్యుడా!"

అని బ్రతిమాలు దీనహృద
యర్థ నిరసించి కఠోరచిత్తు డా
క్షణమ తగిల్చె లేజివురు
కన్నను కోమలమైన కేలుదో
యిని కఠినంపు సంకెళు - లి
కెంతటి జాగును సేయ కప్పుడే
కొని చనె కోటలోపలకు
క్రూరుడు కన్నియ నేమి సేయనో

ఆ కోటలో బంటు లా కట్టె నీ కట్టె
నొక్కచో ప్రోగు వేయుదు రదేల
ఆ ప్రోగు మట్టు తా మాశ్చర్యజడు లౌచు
మూగిరి జను లంత మూక యేల
ఆ మూక మూక కన్నార్పకుండ నె చూతు
రా కట్టెయల పేర్పు నట్టులేల
ఆ పేర్పునకు బంటు లగ్గని దగిలించి
అంత మంటను రగిలింతురేల

 

అట్టి మంటకు నాలుక లన్ని యేల
ఆకొనిన యట్లు లా మంట లార్చు నేల
అమ్మ అమ్మా యటన్న దా యబల యెవరు
అగ్నికుండాన నైచి రా యబల నయ్యొ!

ఔరా భారతభాగ్యలక్ష్మివగు నై
నా! నీకు తోబుట్టుగుల్
లేరా? నిన్ను దహించు గుండె లవి ఔ
లే? యీ విశాలంపు హిం
దూ రాజ్యంబున నీ యమాయికపు ని
ర్దోషంపు లేబ్రాయపుౕ
స్మే రాస్యమ్మును రక్షసేయు నొకదుర్
సిద్ధమ్ము కాలేదటే?

ముప్పదికోట్ల సోదరులు
మూలుగుచుండియు చెల్లి! నీకు ఈ
తిప్పలు తెచ్చిపెట్టిన వి
ధిన్ మొదలంటగ నూడదీయలే

దప్పటికే యనాథ, లటు
లైనను. నీ యపరంజిదేహ మా
గప్పన మండు మంటల క
కారణ మాహుతి యాట కోర్చిరే

భారతరక్తబిందువు ప్రి
పంచమునం దెవ డొందియున్న నా
వీరకుమారకుండు మృతి
భీతికి లోగడు, పందయై జలం
బూరెడి కన్నులన్ గనడు
ఊరక రాయివలెన్: జ్వలత్ క్రుధా
పౌరుషముల్ జెలంగ నని
బడ్డ పడంతుక లెంద టీ స్థలిన్ !

ఒక్కొక డొక్క సింగముగ
నొప్పగలా డగుగాని దుర్విధిన్
జిక్కెను; వీరవహ్ని మతి
చెడ్డ ఒడళ్లను దాగి క్రమ్గు చే

దిక్కును లేక యేడ్చు; బ్రకృ
తిక్రమ మెన్నడు చేతి కందునే నా
చక్కని వేళ భారతని
జప్రభ లేరు రుచింతురో తుదిన్.

తల్లీ! నీ హృదయమ్ము భుగ్గురను దీ
ప్త జ్వాలలం దెట్లు ఘో
షిల్లెం బో— అది యూహసేయుటకు ని
ర్జీవుండనై సిగ్గు ప్రా
విల్లన్ కన్నులు మూతు; కన్పడును దే
వీ! ఘోరదృశ్యమ్ము: మే
నెల్లన్ ఝల్లను; గుండె రాపడును: ని
న్నీక్షించి రక్షెట్టులో!

నీపయి పంచప్రాణములు
నిల్పి పవిత్రపు ప్రేమ దుగ్ధముల్
ద్రాపుచు తల్లిలేని కొఱతల్
సమయించిన నీదుతండ్రి తా

నే పరభూములందు చరి
యించునో కాని యిదే ప్రవృత్తి నే
ఆ పురుషుండు విన్న ' తన
యా ! ' యను నాలుపు తోనె మ్రందడే !

పాపులు త్రోయు నెత్తుకొని
పావకు డాపెను కుక్షిలోనికిన్
జేపడ దీసి ' తల్లిరో ! వి
శృంఖల మీ తల, మింక నీవు – ఏ
పాపుల పీడలేక – సుఖ
భావినివై నిదురింపు ' మన్నటుల్
దోపగ భాగ్యలక్ష్మి కను
దోయిని మూసె గృశాను కీలలన్

ఎత్తిన వేయి చేతుల నొ
కే పరి పావకు డప్పళించి తా
నొత్తుకొనెన్ గుమారిని ని
జోదరమం : దొక రెప్పపాటులో

 

మెత్తసిలేతమైమిసిమి
మిన్కులు మాసెను, లీనమొందె నా
మృత్యున ముద్దుబిడ్డ; యిక
మృగ్యము చిక్కిన ధూళి నేదియో -

వెనుకటి యుగాన దేవకీవనిత చేతి
బిడ్డ నాబిడయన్న పైవిసరినపుడు
వింత యాకృతితో నది విశ్వమందు
నిలచి పలికిన పలుకు ధ్వనించె ననగ

ఆ పసియాత్మ పైకెగసి
యాకస మంతట నావరించె నే
రూపము లేకయే : కనగ
రోదసిలో నొక క్రొత్త చాయ లే
వో పయికొన్న యట్టులు - ప్ర
బుద్ధము భారత మానె. యన్నటుల్ -
ఈ పతనమ్ము నిల్లై భరి
యింతురె, లెం డికనైన, యన్నటుల్ -

అంజలించిన దోసిళ్ల నశ్రువారి
తర్పణము లొడ్డి గగురెత్తు తనువులందు
క్రొత్త సందేశమును నింపికొనియు జనులు
మూగియుండిరి కర్తవ్యమూఢులగుచు

హేదారకు వచ్చె నప్పు డదేవో తంతి
తీసి చూడగ క్యానింగు వ్రాసినదియె
మంత్రిమండలి 'మైనాకుమారి నేమి
యననల' దటంచు క్షమియించి నట్టి వార్త

ఇది యొకగంట ముందు లభి
యించిన, నింతటి ఘోరహత్య కా
మృదులత మాడిపోక చిగు
రించిన నవ్వుల లేత మొగ్గలన్
సదమదమా నెడందల కొ
సంగి విషాదపు కాలకూటముల్
బొదలగ నీక చల్లని ప్ర
మోదసుధల్ గురిపించి యుండునే!

అవసరము తీఱి యసువులే యాఱినపుడు
అమృతవర్షమ్ము గురిసిన యట్టి ప్రేమ
జూపినది మంత్రిమండలి శుష్కమయ్యె
యశము దక్కఁడు మాసిపోవనిమె మచ్చ

# ఉత్తరమ్

నానాఆత్మజ నా సుమాలసను
మైనాపుత్రి నా మంటలం
దానా డట్టులు నింపుప్రాణముల ద్రో
యౌ గుండెలా ఆంగ్లసే
నానుళ్ వేపుర కైన నాడచట తాం
త్యాటోపియే యున్నచో—
లేనేలే డత డేడ కేగనొ కుమా
రీ భావ భ స్వంతుడే!

[౪౨] మైనాదేవి

బాలిక భస్మమైన విష
పన్నగసన్నిభసాంధ్యవేళ చిం
తాలుతితుండు కోటగడి
దాటి క్రమమ్ముగ రామపాలు డా
త్మాలయమందు జేరి త్రుటి
మైన చనంగను లేదు:- చూడ నే
వ్రాలును లేని లేఖ నొక
పాంథు డొసంగి చనంగ దానిలో

— లేఖ —

" ప్రియ రామపాలసింహునకు -
అవసరములైన కొన్ని కార్యముల
గుఱించి ♦ ఢిల్లినుండి వచ్చితిని దే—
డిల్లపడక ♦ నేటిరేయికి నడిజాము
దాటుతఱికి ♦ రమ్మొకడ వీవె
భగ్నసౌధమ్ము కడకు
శుభకాంక్షి సన్యాసి - "

అనిపరిఁయించి 'ఎవ్వడిత'
డంచు గడుంగడు చింతసేయు, 'ఢి
ల్లిని విడి వచ్చె - సంశయము
లే దిత డౌను తాంతియా'
యను - 'సది శత్రువుల్ సలుపు
నట్టి వినూతనతంత్రమో కదా'
యను - 'నెట్టులైన నే నచట
నాతని జూచుట పాడి యగా' నను౯

ఇక సందేహము లేక పో దలపుతో
నే సిద్ధమై మధ్యరా
త్రికి భగ్నాలయ మున్న చోటునకు జే
రె౯ రామసాలుండు - - ఎం
తకు లే దెవ్వరి జాడయేని, విసు గె
త్తె౯ బోవ నుంకించు వా
డు క నె౯ నాలుగు దిక్కులొక్కపరి చు
ట్టు౯ - అంత నొక్కుమ్మడి౯

 

కూలిన కుడ్యశేషముల
కుక్షి నడంగిన రాజసౌధపుఁ
వాలక మెట్లు లాంగ్లులకు
భ్రాంతిదమై తనరారెనో తదీ
యాలఘు శిల్ప మాత్మగత
మయ్యె; జనించెను భక్తిభావ; మా
వ్రీలిన మేఖరా శ్లతని
వేలుపు లైనటు లెంతో సమ్రుఖై

ఆస్థలము చుట్టు తిరుగుచు ''నక్కటకట !
కాలగతిలోన నింత వక్రిత తటస్థ
మగునె కనులార చూచుచుండగనె!'' యనుచు
నొకదెసకు జూచి యనుమాన మొందె నేమొ

ఆ విమలంపు చంద్రికల
నచ్చపువెల్గున దూరమందు నే
వేవియొ చిహ్నముల్ మనుజు
డే యను నట్టివి తోచినంత, తా

నా వలఁకే కరమ్మున త
యారుగ నుంచిన పిస్తు లెత్తేదుర్ -
వే విడువంగబోవు గతి
వ్రేళుల బూన్చి నిరీక్ష సేసెదుర్

జటలు ధరియించి యొడల భస్మము నలంది
తనచెసకె వచ్చు కాషాయధరుని జూచి
'మిత్రులో శత్రులో ముందు మీర లెవరో
నుడువవలె' నన్న; యోగి 'మిత్రుడనె' యనియె

ఆ వర్ణత్రియమందు పెఱ వెతలె మ్రో
యన్ 'తాంతియాటోపియే
యీ వేషమ్ము ధరించి వచ్చె' నని యూ
హించెన్ - యథార్థ మ్మదే, -
ఆవేశించిన భక్తి నప్పుడు ''మహా
త్మా! నన్ను మన్నింపుమా:
మీ వృత్తాంత మెరుంగ లేక యిటులన్
మేకొంటి నార్యా'' యనన్

తిరుగు జబాబు లే దత డ
దేపని జూచును మొండిగోడలర్ —
తెరచిన నోరు, విచ్చిన క
నుంగవ, మెత్తిన కంటిబొమ్మలుర్,
దొరలని శ్వాస - యిట్టులు వి
నూతనలోకము జూచురీతి నె
బ్బెటికపు తీఱులర్ గనును
పిచ్చిగ పిచ్చిగ తాంతియా కటా!

అతని యెడందలో గలుగు
నట్టి గతస్మృతులుర్ భవిష్యదర్థ-
తుములభాసనల్ వెలికి
రావని గాని, తుపానువేళ రే
గు తరగ లంబుధిర్ వలె ప్ర
కోపితు జేయును లోన లోన,—
'ఈ గతి విధి వ్రాసె చూడు'
మనగా పడియేడ్చెడు మూక కుడ్యముల్;

అంతర మెల్ల నొక్కపరి
యాహుతి గాబడినట్లు, అంపెల్లో
సుంతలుగాగ కోయబను
చున్నయటుల్, భరియింపరాని ప్రా
ణాంతకమైన వ్యాధికి ల
యమ్మయి పోవుచు నున్నయట్లు,-
'శుద్ధాంతము లెన్ని రూపతె సహా'
యని తాంతియ చూచి చూచియుఁ

" తెలుపుము రామపాలుఁడ! గ
తించిరొ యిట్టులె నానసాహెబుఁ
లలితశిరీషకోమలవి
లాసిని యూతని ముద్దుబిడ్డయుఁ
విలులితదేహులై - తెలుప
వేమి - అయో - లయమొందిరా సఖా?
ఇలపయి వారిలోన నొక
రేనియు దక్కిరటంచు చెల్పవో"

 మైనాదేవి

అని యడుగువాని కాత డేమనగవలెనో
'త్రోయబడె నగ్నిలోన మైనా' యటంచు
నెటుల వినిపింపవలెనో సంకటముపడును:
తెలిసె ననుకొన్న దుర్వార్త తెలియలేదు.

పలుకకుండిన యా రామపాలుతోడ
తాంతియా యనె మిగుల నాత్రము చెలంగ
" ఏమి - చెప్పవు - ఆంగ్లేయు లింతవరకు
తెగడి మైనాను పట్టి బంధించరు కద ? "

అప్పు డా రామపాలు " డాయమ పవిత్ర
దేహవిధ్వంసనార్థ దాకు ధీవిశాలు
డెవ్వడును లేడు లే " డను చేమొ ఆత్మ
పరమునర్ జెప్పె; తాంతియా యెరుగ కద్ది

" మఱి యెచట నుండు మైనాకుమారి యిప్పు "
డనియె వేవేగ జూచు పేరాసతోడ :
" అకట ! వచియింపజాల నాయమ విషాద
భయదవృత్తాంత " మని రామపాలు డనియె.

తొలుత మొలిచిన ధైర్యంపుమొలక యిపుడు
మాడి మసిగాగ నిలువని మనసుతోడ
నడిగె "ఏమి - ఆ రాజకన్యక జగత్తు
విడిచియే పోయెనా" యని వడిగ వడిగ

"పోయిన దా సుమ మ్మసుర
భూముల వీడి నిలింప పుణ్యపూ
జాయతనమ్ములో జరుగు
నర్చనలందు నిరంతసౌరభ
శ్రీయమధూత్కరమ్ములు వె
సన్ విరజిమ్ముచు నిర్జరాళికిన్
ధ్యేయపదార్థ మౌట" కని
తెల్పక తెల్పెను రామపాలుడున్.

గగనవనీవిహారి విరు
గంబడి నవ్వెను చందురుండు సాం
పెగయగ చాతకాంగనల
కిచ్చు సుధాసవశీకరంబు, లిం

పుగ వలపించు, ప్రేమరస
పూర్ణకరమ్ముల బుజ్జగించు, లీ
లగ గమియించు కాలము న
లంతలులేని మహాసుఖమ్ముగా.

అదియే వేళకు తాంతియా హృదయమం
దాకార! రక్తస్రుతుల్
భిమరాఘాతపరంపరల్ లయకళా
భీభత్స భిన్నార్భటుల్ -
ఎదియో చీకటికోణమై ప్రకృతి, అం
దేమున్నదో తాంతియా
హృదయం బింత యెరుంగలేని జడవృ
త్తిన్ బుచ్చె నెన్నో త్రుటుల్

తాంతియాటోపి తనదు తత్కాలదశను
తిరిగి గురితించి విషయము నెరుగ నడిగ
"ఎవ్వ డా దుష్టపథవర్తి యిట్టి గతికి
తెచ్చె నోర్వక రాజమందిరము దీని"

" ఆంగ్లమంత్రు లొసంగిన యాజ్ఞవలన
జనర లొ(ట్రాము సేనతో సాగి వచ్చి
మరఫిరంగుల (బేల్చి యీ మహితసౌధ
రాజమును గూల్చె మదిని నిర్దయ వహించి "

అపు డనియె తాంతియా వింతయక్తరమున
" ఆ విషపువేళ రాజసౌధాంతమందె
వేరువిధిలేక మైనాకుమారి చిక్కు-
బడియెనా యేమి ఓ రామపాల సింహ "

" వినయవతి శోకమున నెంతొ వేడుకొనియె
గాని వినలేదు నరపశువైన యతడు
మంత్రులవచస్సునే గొల్చి మంట గలిపె
నానసాహెబు స్వర్గ సుందర జగత్తు "

" అట్టియెడ నా శతఘ్నికా వ్యగ్రవహ్ని
శిఖలకాహుతి యయ్యనే చివురుకన్నె ? "
అని ప్రకంపిత గాత్ర విహ్వలుడు పృచ్ఛ
సేయ రామపాలుడు వచించెను గత్తారి.

 

" సౌధము భగ్నమయ్యెడి వి
షాదపు వేళ కుమారి యేడకో
బోధము కాని మార్గమున
బోయిన - దెవ్వ రెరుంగ ; రే మనో
వ్యాధ కలంచెనో అచట -
నామె యొకానొక మధ్యరాత్రి ను
ర్వీధరధీరమై ధరణి
వ్రీలిన గోడల ధూళి చెంగటన్

చేరి " నా స్వర్గధామమా! నారమాధి
వాసమా! నా వికుంఠదివ్యాలయంబ!
విలయ మొందితివే నన్ను వీడి " యనుచు
గోడుగోడున నేడ్చెను గుండె లవియ

అటకు చేరువలోనున్న యాంగ్ల సేన
వినియె నాయేడ్పు: ఔట్రాము పిదప వచ్చె:
'లభ్యమయ్యె నికన్ వీడరా' దటంచు
పట్టుకొనెను కుమారి నర్భకను ఖలుఁడు "

' అక్కటా! ' - హా విధీ! ' యను చరుణమై స
మస్త దేహమ్ము రుధిరాన మఱగినట్టు
లగుచు తాంతియ తన పాణియుగమునన్ గ
పోలతలముల గన్నుల మూసికొనియె

కొండొకసే పత డట్టులె
యుండెను, మొగమెత్తి పిదప " నో చెలుడ విపత్
కుండము దాటెను తొలి: యీ
దండకు తను గాన రా గతంబెది మరలన్ "

" అన్న! ఆదేవి యాత్మసమర్పణమ్ము
జేయ దల పోసి యేమొ వచ్చినది మరలి
మాతృతలము నిలింపధామమ్ము దగ్ధ
మైన నాకేల జీవిత మనియె యేమొ "

అని రామపాల సింహులం
డన విని భయభక్తినమితుడై యొడలు గగు
ర్చిన వణకెడి కంఠముతో
ననె " సౌట్రా మెట్టి శిక్ష నాయమ కిచ్చెన్ "

" అది వచింపగ నాజిహ్వ కలవి గాదు
ప్రళయకాలాగ్నిరుద్రనర్తనమె నాడు
బ్రతికి యుండియు జీవచ్ఛవమ్మె జగతి
ఎద పగుల దేల దృశ్య మూహించు వేళ "

వేల నతిక్రమించెదు గ
క్షీరసముద్రజలమ్మటుల్ క్రుధా
క్షాళిత ముష్ణరక్తము ప్ర
కంపితమై తనువొక్క వల్మిక
వ్యాళముపోల్కి పొంగ, కర
వాల మొఱన్ విడ లాగి, కన్గవన్
రాలగ నిప్పుకల్, పెదవి
నాకుచు శౌర్యపయోధి తాంతియా -

అనియె సహియింపరాని రయమ్ముతోడ
" ఆ హృదయహీను డే శిక్ష నామె కిచ్చె ?
ఎఱ మొనర్పక వచియింపు మిక మదీయ
చండఖడ్గమ్ము లయకాలసర్ప మోయి ! "

మైనాదేవి [౫౫]

" ఆ లతకూనను దుష్టుడు
జాలి యనున దింత లేక జ్వాలదగ్నిశిఖా
జాలమునన్ బడవైచెను
కాలి క్రమందె నిందుపాణిణి కర్కశము సఖా "

'హా - మైనా -' యనె తాంతియా... అతని ప్రా
ణాంకూర మెందేగెనో
ఆ మూర్తమ్మునయందు, - రూపఱిన వా
యాక్రోశమం దెన్ని యా
హా మార్ద్వీక పయోధులో, - మధుర భా
వానందసౌధమ్ము లె
న్నో, - మున్గన్నవి యెన్నియో వ్యధలు, - శా
పోల్లోలకల్లోలుడై

" ధర్మదేవత పుట్టిల్లు : కర్మభూమి :
శాంతి, సత్య, మహింస, సంచరిలు వీధి :
హైందవక్షోణి ! ఇట నింత యాసురోద్ధ
తోగ్రచండనాట్యమ్ము మీ రోర్చినారె ? "

సిగ్గు దహించుంప గన్నీరు చిందిపాఱ
వ్రేలవైచి తలన్ రామపాలు డనియె -
" ఆ పసిడికొండ దక్కుటకై పథమ్ము
లెన్ని త్రొక్కియు విఫలతయే లభించె:

కాని యనంతరమ్మున స
కాంక్షితమై లభియించె తంతి ' నై
నాను క్షమించినార, మిక
నాతి చెఱన్ విడిపింపు ' డిద్ది మా
యానతి ' యం చమాత్యవరు
లంపిన వార్త విలాతినుండి - ఆ
లోనొక గంటముండె యిహ
లోకము వీడె గుమారిప్రాణముల్ "

" ఏ సురలు తండ్రికొమరిత లెసగు వేళ
గ్రాలె నమరావతిగ కాన్పురమ్ము ; వారు -
నానసాహెబు మరియు మైనాకుమారి -
లేరు: నాపాలి కిది యింక ప్రేతభూమి

ఆరిపోదేమి నా జీవికార్చి ? యింక
కోరు నేది నిరర్థకగోత్రయందు ?
ఏది నా భావమధురసాంద్రదేశువణము ?
ఏవి యేవి - దిశల్ కానరావ వేల ?

అది యధీరుని లక్షణ మటులు వలదు
అసువు లీ భాండమున వెల్గు నంత వరకు
నా మహాదేవి కపరాధ మాచరించి
నట్టి వారి నిర్మూలింప నరుగువాడ "

అనుచు పోబోవు తాంతియా నాపి రామ
పాలసింహుడు గద్గదస్వరముతోడ
నడిగె దీనమ్ముగా " మహాత్ముడ! ఇచోటు
వీడి మీ రేగెదరు ముందు కేడ " కనుచు

" చెలుడా! నే నిపు డీ స్థలిన్ విడిచి కా
శీక్షేత్రమున్ జేరెదన్,
కల దచ్చోటున మాదుసేన, జరుగం
గా బోవు పోరాట మాం

గ్లలతో నింక, జయమ్ము కల్గునని నా
లో నాత్మ ఘోషిల్లు, రా
గల దెంతో నృపవర్గ మయ్యెడల రం
గంబందు మాత్రోడుగన్ -

జయమే కూడక పోయెనా భరతరా
జ్యశ్రీకి నీమధ్య రా
దు యదార్థమ్ముగ స్వేచ్ఛ: యిద్ది భగవత్
సూక్తమ్ముగా నమ్మ మో

యి! యెటుల్ గూడునో కాని - నామటుకు నే
నిచ్ఛానుతిన్ పోరులో
లయమై పోయెద మాతృముక్తికయి హా
హాకారి పోరాడుచున్ -

ఈ శరీరమ్ము సాధించు నేది యింక?
ఆ పవిత్రాత్మ స్వర్గస్థమయ్యె దేని
నిచ్ఛగించెడి నదిగాక? ఇంతకన్న
నాకు వేరొక్క విధి కడదాక లేదు"

" ఎందు డున్నారు సైనికు ? లెండ అవని
పాలకులు నాడు మీకు తోడ్పడెడి వారు ? "
" సేన పదియారు వేలు మించినది మాది -
కలవు రాజుల సేన లింక నొక కొన్ని :

అది యటు లుండనిమ్ము చెలు
డా ! యిపు డొక్కటి యంత్యకాంక్ష నా
యెద దహియించుచున్న ' దది
యింత దయావతి నాలకింపు : మా

మృదులత మాడిపో మిగులు
మృత్తిక గాలికి రేగుచుండు నీ
యదనున సుంత లభ్యమగు
నన్నది యాశ, పథమ్ము తీయుదే

రామపాలుడు నావెంట రమ్మటంచు
నడువగా ముందు తాంతియా నడచె వెనుక
చేరి రాపైని మైనాకుమరి యెచట
బూదిగా మారెనో ఆ ప్రపూతతలము

చేరి, చేరగనే భస్మశేషమునకు
తాంత్రియూటోపి చేసె ప్రదక్షిణములు :
ఎడతెఱపిలేక యపు డెన్ని యెన్ని వెడలె
నతని హృదయమ్ము పగిలి హాహారవములు !

" ఓ పరమపావనీ ! నేను నీ పవిత్ర
పాదసవిధమ్మునఁ వ్రాలు ప్రతిన నాకు
కలదని యెఱుంగవో - మున్నె తెలుపలేదె ?
వచ్చితిని, యేది నీ పాదపద్మయుగళి ? "

ధీరుడు వీరుడే మరియు
తీక్ష్ణమనస్కుఁడె గాని తాంత్రియూ
పారములేని శోకపు ప్ర
వాహములో బడిపోయె, నెట్టిదో
వారల బంధుభావము: ప్ర
పంచము నాఁడె లయమ్ము నొందిన
ట్లూఁతట లేక నేఁడిచె న
యో శిలలేని ద్రవించి పోవఁగ

భీకరమ్ము కఠోర మూర్త్యధరమ్ము
కాని యీ గుండెలో దాగె కరుణజలధి
ఎడతెగక రేయిపవలును బడుచునుండు
స్వచ్ఛజలపాతము ప్రబలసాక్ష్యముకద

ఒరసిమొరసి తటమ్ములు పొరలి పొంగు
వాహినీనీర మది యెంతవరకు చనునొ
అంతవర కది చనియె ప్రశాంతి నొందు
సహన మలవడ నీలోన సమయ మేడ

వేడి వేడి కన్నీళుల వెడలబుచ్చి
గాలిచే లాలితమ్మగు కన్నెబూది
నింత గైకొని గుండెలో నిమిడి యున్న
క్రోధవహ్ని జ్వలింప బ్రకోపియగుచు

" దేవీ! నీ చితిభూతిలో మొలిచి మా
తృస్వేచ్ఛ సాధింప నె
న్నే వీరాత్మలు జొమ్ములిచ్చుటకు నే
డే లేచివచ్చు దివ

 మైనాదేవి

మ్మో వాంఛించి - తదీయకోపలయవ
హ్నిజ్వాల లిచ్చోటనే
ఆవిర్భూతము నొందగావలె రణ
వ్యగ్రక్షుధారంభముల్

నీకు జరిగిన దుస్సహానికృతి కింక
తగిన ప్రతికారమును సల్పు దండిమగల
రోషభీషణఘోషణోరుప్రచండ
వేల్లనముచేత పృథివి కంపిల్లవలయు

రూ పది మాసె, నైన పర
రూపము నీది సమస్తభారత
క్ష్మాపరిపూర్ణమై సమర
ఘాంటికమై - విజయావబోధవే
ళాపరిరంభ మాసగొని
రక్తము ద్రావెడి వీరకోట్ల కె
ట్లో పొడకట్టి లో వెలుగు
లో జ్వలియించును లెమ్ము లెమ్మికన్

*

జననమిచ్చి పోషించిన స్వర్గ భూమి
పుడమి తలమానికమ్మగు పుణ్యభూమి
పడగరాసి చెఱ బడి బడలు చుండె
'లేరె కొడుకులు' అని నిద్ర లేప వలయు

లెమ్ము లెమ్ము
మైనా దేవి
లెమ్ము లెమ్ము

*

తల్లి ఋణమున బడి తేనె ద్రావు నెవడొ
మాతృసేవకు రాని సోమరి యెవండొ
అట్టి యెడదల నెత్తురు బొట్టు దీసి
యిది భరతరక్తమని తెల్ప నేగవలయు

లెమ్ము లెమ్ము
మైనాదేవి
లెమ్ము లెమ్ము

*

ఇది యొక లతాంగికే యైన హింస కాదు
ఇది నిఖిలభారతీయుల కీయబడిన
ప్రకట విద్రోహ కృతక పరాభవమ్ము
మానధను లెవ్వరని వీరమతి జిగుర్ప
లెమ్ము లెమ్ము
మైనాదేవి
లెమ్ము లెమ్ము

*

ఓర్పుగల తల్లి తనవార లౌరు లటంచు
చూడ కిల్లిచ్చి నిల్వ నిచ్చుటయె ఘోర
పాపమై తల్లి పడరాని పాట్లు బడును
వెర్రి బిడ్డల కిది తెల్పి వేగ బిలువ
లెమ్ము లెమ్ము
మైనాదేవి
లెమ్ము లెమ్ము

*

పరులు చూపెడి మెరలకు భ్రమసిపోయి
ఒరగి పడియున్న జననిపై మఱపుగలిగి
స్వార్థకూపాంధతమములో సంతసిల్లు
భరతసంతతి కొక భక్తి గఱపవలయు
లెమ్ము లెమ్ము
మైనాదేవి
లెమ్ము లెమ్ము

*

దైవనిలయము భారతధర్మశాల
ఇట ప్రసాదము తీర్థము నింత గొనియు
మొక్కి వెడలక గుడి గూల్చు ముష్కరులను
జూపి స్వామికి కోపము రేపవలయు
లెమ్ము లెమ్ము
మైనాదేవి
లెమ్ము లెమ్ము

*

తల తలకు పెత్తనమ్ముగ తగవులాడి
అన్నదమ్ములరే మీరు భిన్నులైరి
ఇల్లు దూరి పరుల్ మీకె యెసరు పెట్టి
రిది యెరిగి కూడ రారు రారేల యనగ

లెమ్ము లెమ్ము
మైనాదేవి
లెమ్ము లెమ్ము

*

స్వేచ్ఛలేని సుఖ మ్మేమి, జీవ మేమి
జుట్టొరుల కిచ్చి వ్రేలాడు సుఖములోన
నవ్వుకొనెడి నికృష్టుడా! నడుము కట్టి
రంగమున దూక వే మను రవళిగొలుప

లెమ్ము లెమ్ము
మైనాదేవి
లెమ్ము లెమ్ము

*

తగిన శూరుని నాయకత్వమున కొప్ప
సమరసంసిద్ధులై రండు జాగు వలదు
వలదు బహునాయకత్వ, మెవ్వాడు మేటి
వాని కెదురాడరాదని పూని చెప్ప

లెమ్ము లెమ్ము
మైనా దేవి
లెమ్ము లెమ్ము

ఎవరితో బల్కుచుంటి నే నింత సేపు
ఎట గలవు దేవి ! అగ్గిలో నటమటించు
చెంత ఘోషిల్లితివా? శౌర్య మెంతగలిగి
వృద్ధులము మేము నిన్ను గాపాడలేదు

మాడిపోయితివే సుధామధుర వాణి !
కాలిపోయితె నీలమేఘప్రవేణి !
బూదిగా మారినావె నవ్వుల వలంతి !
దగ్ధ మొనరించిరే తటిత్కనకగాత్రి !

అంతమైనది నీవు కా, దఖిల భార
తీయగౌరవసంపత్తి: మాయమయ్యె
భారతీయాభిమానదీవ్యత్ప్రతాక,
నీవు కాదు: నీ వమరవు దేవి! నిజము

వెలితిలేక నిండిన నీకు విశ్వరూప
మెవ రెరుగనేర రవ్వారి కీ శ్మశాన
వాటియే పుణ్యతీర్థమై వఱలగలదు
దేశకాలభేదము లేదు దేవి నాకు

కోప పడబోకు మోదేవి
నీ పవిత్ర
భస్మ రేణూత్కరమును నా
పాణి తాకి
మైల పడవైచె ననిః నాదు
మనవి వినుము –
శాంతియాటోపి వీడు నీ
దాసవరుడు

*   *

*

ప్రాణ మ్ముండెడి దాక స్వేచ్ఛకయి, సం
గ్రామమ్మె జీవమ్ముగా-
ఈ నీ భూతి మదిష్టదైవముగ- నే
నే యుద్ధమం బున్న మై
నానామస్మరణమ్ము సేయగల సం
తర్క కాలమ్ము దీక్ష, దే
వీ! నీదాసుకు నీదు భస్మమును ప్ర
ధ్వాగర్భముం జేరెడిన్"

*

*   *

 

*     *     *

*     *

పిదప౯ – ఎందఱొ నానసాహె బితడే
వీడే యటం చాంగ్ల దు
ర్మదసేనానులు పట్టి వధ్యశిలపై
ప్రాణమ్ములం దీసిరో –
తుదకైన౯ లభియించెనో అతడు, లే
దో – త్రాంతియా కే గతుల్
బొందవె౯...ఏమొ – వచింప నేటికి
కథాలోల ప్రపంచమ్ములో

*     *

*

*

పండిత సుదర్శనుకు
ప్రతివాసి స్వేచ్ఛానువాదమై
'రాజయితే నేమి' అను శీర్షికతో
౧౯౩౯ లో జనవాణి జన్మదిన
సంచికయందు వెలువడిన కథయే
యీ రచనకు మూలము -
అందలి భాగస్వాముల కెల్లరకు
నా కృతజ్ఞత.

౧

అతడు బలశాలి జనహృదయాపహారి
రిపునికరమానహారి ముద్రితదిగంత
కీర్తివర్ణుడు 'పాంచాలకేసరి'గ ప్ర
సిద్ధి నొందెడు రణజితసింహు డతడు

ఎరుగ డొక వీధిబడియును
గురువరు నెవ్వరిని జేరి కొలువ డతం డే
కరణి ధరణి బాలింపగ
నురుతరనయవేత్త యయ్యెనో తెలియదుగా

నలువది హాయనమ్ములు జ
నమ్ముల కిమ్ముగ పాలన మ్మొన
ర్గళముగ జేసె, శిక్కతడు,
గండరగండడు: వాని పేరన్
బులిని స్మరించి నట్టులగు
భూపుల కుత్తరభారతాన, నాం
గ్లులకును కాబులీలకును:
కోరెద రెల్లరు వాని చెల్మినే

కాబూలీరుధిరమ్ము ఝల్లుమనగా
కంపిల్లి తద్దుర్గమూ
లాబంధమ్ములు నూగులాడగ రణా
వ్యాసక్తు డయ్యెన్ జితో
ర్వీబాధార్వశిఖామ్మయుండగుచు ని
ర్వీర్యప్రజారక్షకై
తా బృందిష్ఠవరిష్ఠశీతలకృపా
ర్ద్రీద్రష్టుడై వర్తిలున్

తద్రిష్టక్ష్ణుతధార భీకరబృహ
ద్ధాత్రీధరం బౌనో పృ
గ్వోద్రేకప్రచలద్ర-హోర్మికల రం
హోద్దీప్తి చల్లార శ
త్రుద్రాఘిష్ఠసరిత్కదంబ మచల
ద్రుస్థూలరింఛోళిగా
'భద్రం తే రణజిత్ సువీర భవతు
స్వస్త్యస్తు తే' యం చనుఁ

ప్రకటప్రోద్ధతపరరా
ణ్ణికరవ్యాపాదనోగ్రనిర్ణిద్రబల
ప్రకృతులు హూణులై తత్త్రుధ
నోకబాడబశిఖిగ భీతి నొందెదరు గదా

అతడంత సుందరుడు కా
డతడొక యాజానుబాహుఁడైనను కాడే
అతడొక్క పొట్టి మానిసి
అతనికి జగమింత జడియుటది యొక దశయే

రాజ్య ముద్యాన మత డగరాజి నేలు
తోటకాపరి పాలితద్రుమలతాళి
హర్ష సుమవృష్టి నొల్కు ననారతమ్ము
త్రిదివనవశోభ భువిని బొందిన దనంగ

అతని సంకల్పానుగతమహారంభజా
స్తోకసిద్ధ్యంతభల్లాకదీక్ష
అతని జగజ్జీవనాధ్వప్రకసూత్రీయ
మానవదైవీభక్తిమద్దిదృక్ష
అతని మూఢజనతాహమ్మతిదళనసం
సిద్ధకరాళవాణీబుభుక్ష
అతని రాష్ట్రప్రజాహ్లాదకైంకర్యసం
భూతభూరిశ్రమభృత్తితిక్ష
కలసి యాతని పావనాఖ్యాను సువర్ణ
దివ్యదీప్తాక్షరములతో దీర్చిదిద్దు
జగదతులకీర్తిమద్రాజశంసనప్ర
ణాదచారిత్రకప్రబంధమ్మునందు

జలజలపూలు రాల, పువు
జప్పర మొల్కాడి హాయిలో వెతల్
తొలగ, తలంపుల్ జవులు
లోగక రేగెడి వేళ కోకిలల్
గలరవ మాలపింప, పసి
గాడ్పుల సంజ ప్రవేశమై, యెటో
తెలియక పచ్చకామిని గ
తిఁ బ్రభుపాలన తన్పు బాలికల్

" మతము పవిత్రము జీవ
న్మృతు డత డెవ్వాడు దాని మీఱి చరించున్
బ్రతు కతనికి తగదని తీ
వ్రతరస్ఫుటబోధ సేయ బడలడు సభలన్

ఒక తెను బెంగ్లాడవలెన్
సకలము గని మున్నె తనకు సరిమైన సరిన్
వికృతిని గూర్చెదు యువతీ
నికరము గని తొలగు డనుచు నీతుల గరపున్

ఎట్టెటు శ్రేష్ఠుడు నడచెను
నట్టటులే జనులు నడతు రాతురముమెయిన్
దిట్టరియగు నృపవరు డొక
కట్టడితో నడువవలెను కని సకలగతుల్

యుష్మద్ధితకరసుపథో
గ్రోష్మసహిష్ణుండ నగుచు నొక్కట నేనే
యుష్మదహితముగ నడువన్
భీష్మమ్ముగ శిక్షసేయ వెరువకుడు నన్ర్"

తీయని తేనెలై కళలు
దీర్చిన చల్లని పండు వెన్నెలై
సోయగ మొల్కు కల్కిజడ
చుట్టకు గుచ్చు గులాబిపూవులన్
హాయిగ జారి నెన్నడల
నాడుచు వచ్చు సుగంధవీచులై
పాయక నిల్చి యా ప్రభుని
పల్కులు పాడుగొనెర్ ప్రజాళిగోర్

 ఘోరార్కన్య

౨

దానిపయ్యెదగూండ్ల దడియు జక్కవకవ
బాటించు నెన్నెన్ని వేటకనులు
దాని పాంజీబుల తళ్కుమీఁగాళ్లతో
తడబడు కనుచూపు జడలవెన్ని
దాని మేలిమి మేను దాఁగిన బిలుగు పా
వడ కెన్ని చూపులు ముడుపు లంపు
దాని కెమ్మోవిలో తడిసి చిందిన నవ్వు
కలువల కెన్ని కన్గవల పోటి

అది వయసుతోటలోపల నడుగు బెట్టి
పెట్టకున్నప్పుడే దానిపేరు పుడమి
నల్లడల బాకి పోయె సౌందర్యజలధి
గానవాట్యసుధాబ్ధి మొరా నటంచు

సన్నగా కమ్మగా జాలుజాలుగ వచ్చు
మకరందధారల మాటుకొనెనో
గుళికలు గుళికలై గుటక నీరూరించు
రసఖండముల దండ రాలి పడునో
అలలైన కలరవమ్ముల సుధాంబుధిపైన
పూవుటోడ విహారములకు చనునో
మెలిచుట్టుమెట్ల గాడ్పులమేడపై కెక్కి-
పోవుచు దిగుచు దోబూచు లేమొ
అనుచు నిట్లెన్ని తలపుల నైన నూహ
సేయువరు శ్రోత లద్దాని చిత్రమధుర
మధురసంగీతకళల నుస్మృత్తులగుచు
అఖిలపాంచాలమం దది అగ్రగణిక

లలితవసంతకోకిలగళధ్వనిలోన
కలమాధురీకళాకళిక నేరి
కలహంసచరణమంజులమందగతిలోన
తరళితనృత్తనృత్తముల నేరి
మలయానిలాందోళచలితలతాళిలో
సముదీర్ణహావభావముల నేరి
శరదిందుశీతహాసతరంగపాళులన్
మోహనసీధుబిందువుల నేరి
పాటలో నాటలో జెచ్చుపాటు గొలుపు
నభినయమ్ములలో రసవ్యాప్తిలోన
మిళిత మొనరించి యువకచంచలహృదంత
రముల గదలించినైదు మొనాను సభల

అసమమ్మైన తదీయరూపనటనా
ద్యాకర్షణీయప్రథా
విసరమ్ముల్ వినినాడు రా, జపుడు ప్ర
ద్యోతానసై సర్గిక

వ్యసనమ్మొట్టులో యట్టులే ఒక సభ
బాటించె లాహోరుఃలో –
ఇసుకన్ వైచిన రాల దా ప్రజలలో నేలా ?
మొరా సహ్లాహా !

సంపంగివిరి రేకువంపు వ్రేళులకూర్పు
సుమపాణిపుటి కొక్క. సొగసు గొలుప
నెమ్మిలిమెడవోలె నిలుపు కై దండలు
కళుకుకడాని నిగ్గులను దెలుప
కమ్మెచ్చు తీయు బంగరుతీగె నడుమెన్నొ
భంగిమమ్ముల బరాబరిక సలుప
పారావతగళమ్ము వలె నడు గడుగునన్
దిరుగు కత్తుక సభ్యనీతి విలుప
బొమల ముడుపులు విడుపులు పొడము నవయు
మందహాసాంకురములు విస్మయ విలాస
వివిధచేష్టలు పాటలో వెలయు కవిత
కర్థము కరామలకముగా వ్యక్తపరచు

ఆ సభలోని సభ్యహృద

యభ్రమరప్రకరమ్ము లంగనా

హాసవిలాసపేశలక

ళాసవ మానుచు దాని పాదవి

న్యాసలయానుజల్పితకి

ణంకిణకంకణనూపురాదిభూ

షాసరళశ్రుతిప్రగుణ

శబ్దధునిన్ విహరించు కైపుతో

అది శృంగారపు ముద్ద, కెంబెదవి నొ

య్యారమ్ముగా నొల్కుచు

న్నది శృంగారపు మత్తుపాట, సకలాం

గశ్రేణి బోధించును

న్నది శృంగారపు కమ్మవాసన, పద

న్యాస మ్మదొక్కొక్క టొ

త దయార్ద్రిమ్మె ! స్రవించు నేకడకొ -

సౌందర్యమ్మె ప్రాధాన్యమో -

కుముదాసారము దృక్పరిసారమయినన్
గుప్తమ్ముగా వాడి బా
ణము లందుండి ప్రజాహృదాఢ్యబలసే
నానీకమున్ దాకి గె
ల్వ మహామోహరణమ్ములో నొరగి సు
ప్తమ్మయ్యెనో సేన శై
లజ పోల్కిన్ జలియింప దెంతయని వే
శం బాళయున్ జూడమున్

గడచె నడిరేయి యెవ్వరు కదల లేదు
దాని సమ్మోహదృష్టి ముగ్ధమ్ము మృదుల
నిశిత మవ్యాహతమ్ము సున్నితపు గతుల
జరగి రణజిత్తు హృదయవజ్రమును దాకె

అత డీ లోకపు స్మృతి విడ
చి తదీయత్రిదివశోభ చిందిన భావ
స్మృతి లోకము నం దెయ్యెడ
కు తరలి విహరించువాడొ కోరిక లెవియో



మొరాకన్య

ఆఫీ పాట మొరాను సభాంగణాన
నిలచె నిశ్శబ్దముగ కదలని కొలను వోలె
కాని సభ్యుల కర్ణరంధ్రములలోన
గింగురనుచుండె పూర్వ సంగీతరవళి

ఒకత్రుటిలో బంగారము
తికమకగా కురిసె, రత్నదివ్యద్యుభాషా
నికరము లగణిత మయ్యెను
చకచికిగా దాని[మ్రోల, జనపతి చూచెన్

౩

సభ జరిగి వారమయ్యెను
ప్రభుపాణిని గొని మొరాను ప్రభ్వియె యయ్యెన్
శుభముగ శృంగారముగా
నిరువురు నద్వైతప్రేమ నుందురు నొకటన్

ఈ వివాహమ్ము ప్రజలలో నెంతయెంత
కలవరమ్ము సృజించెనో ప్రళయకోప
చండఝంఝానిలముల నుద్దండగతుల
లేవదీసెనొ- తెలుసుకోలేరు వారు

కులసతి కాదు, వేశ్య: తన
కూర్మిపడంతికి మోస మిద్ది: తా
బలికిన నాటి బుద్ధుల క
బ్బద్ధపు పోకడ యయ్యె: "ధర్మమున్
దొలగితినేని మీమదికి
దోఁచిన దండన మి" మ్మటంచు మున్
బలికిన పల్కు ముల్కులకు
వాడి యొసంగిరి శిక్కు లత్తఱిన్

తను జెప్పు ధర్మమునకే
తను దప్పుట ధర్మమగునె? ధరణీధవుఁడే
పనిగొని ధర్మము దప్పిన
జనులందు నధర్మవృత్తి సాగుట తడవే?

మతము పావన మన్న మతి యేడ కేఁగెనో
సానికెమ్మోవిలో జారెనేమొ
ఏకపత్నీవ్రతం బింత వాకొను బుద్ధి
వెలయాలి కడగంట దొలఁగినదియొ

పాలకు డెట్టులో ప్రజ లట్టు లను నీతి
గణిక కౌగింటిలో కలసి చనెనో
మదిజలింపగ జేయు మగువ జేరకు డన్న
నుడి మొగానుకు ముడి నిడగ రాదో
అని యనంతమ్ముగా బల్కరపుడు జనులు
రాజ్యమం దెల్ల ద్వేషాగ్ని రగులుకొనియె
శిష్క-నయనాల రక్తమ్ము చిందుచుండె
రణజితుని మోము జూడ రౌరవ మటంచ్రు

జనులకు నాయకుండగు ప్ర
చండపరాక్రమవంతుడై సదా
రణజితు నండనిల్చి పర
రాజుల గూల్చెడి వేళ కూడి పో
రిన పులసింహు డిట్టి విప
రీతము నోర్వగలేక కోడ త్రా:
చన బుసకొట్టె సర్వజను
లాతని కోపము జూచి మెచ్చగా

 

“ గురుపీఠమ్ములు రణాజి
ద్వారు డంపెడి శాస్త్రలెల్ల వారింపవలెన్
సురుచిరశిక్కుమతస్థులు
పరుసఁగ నవ్వాని వేరుపరుపగ వలయున్”

ఇటు లా ‘అకాలి’ పులసింహులు పెల్ల పీఠ
ములకు శాసించె, ప్రభువుకు తెలిసె నపుడు
మొదట భీతి పయిన్ జంకు పిదప తంద్ర
మధిక మైనవి నిర్వీర్యు డయ్యె రాజు

“ వలపుల గాలిమేడలు ద
బ్బున నేలకు గూలి పోయె నె
ట్టులు తలయెత్తి లోకుల ప
టు క్రుధ కోరిచి నిల్వవచ్చు? రా
జుల బలమెల్ల శత్రుప్రల
చొప్పున జెల్లునో యేమొ- పాలిత
జ్వాలదరుణాగ్ని రేగునెడ
సాధ్యమె జీవములేని దబ్బుటల్”

అనుచు రణజిత్తు ప్రజల కోపాగ్ని గూర్చి
వారిలోని యమోఘసత్వమును గూర్చి
వివిధగతుల విచారించి వినయమూని
పిలువ నంపెను పులసింహవీరవరుని

భిక్షుకుఁడట్లు రాజతని
వేడిన వేడుటలా!- "ప్రజాసమిత్
పక్షవిఘాతవోయి! పౌర
పాటు క్షమించు" మటంచు దీనుఁడై
రక్షణ గోరి కాళ్లపయి
వ్రాలగ నా పులసింహుఁడుఁ- "బ్రజల్
శిక్ష నొసంగు వా, రడుగ
జెల్లును వారిదె" యంచు బల్కెడుఁ

ఉగ్రవ్యాఘ్రసమగ్రరోషమున ము
న్నుప్పొంగ లేదే! రణ
వ్యగ్రత్వ మ్మెటు బోయె నే డకట! త
త్పాంచాల సింహమ్ములో

ప్రాగ్రోచిఃప్రభ లేశమేని కలవై
రాణ్మూర్తి నిస్తేజమై
యగ్రీయత్వము పోయె, దైశ్యమును హై
న్య మ్మాతని గ్రమ్మె దుర్

చేసిన చేతకై మిగుల
సిగ్గిలినాడు కిరీటదీధితుల్
మోసిన శీర్షమం దిపు డ
పూర్వపరాభవభార మానుచుర్
దోసిలి యొగ్గి నిల్వవలె
నో యని బెగ్గిలి నాడు క్రుద్ధు లే
శాసన మిత్తురో యనుచు
శంకల గ్రమ్మగ్గిలినాడు భూపుడుర్

" దిగ్దిగంతమ్ములందు కీర్తిని స్థిరమ్ము
గా నిలుపుకొన్న రాజపుంగవున కేని
భిక్షుకున కేని నీతి దప్పిన క్షణమ్ము
ధర్మవిధ్యుక్త శిక్షావిధాన మొకటె

అమృతసరమున నీవు శీర్షమున రత్న
మకుట ముంచిన గురుపీఠనికటమున నె
నీవు తప్పు విచారింప బోవు మటకు
రమ్ము - వగచెద, వేమి లాభమ్ము భూప?"

ఇటులు పలికెడి పులసింహు నెడదలోని
ధర్మనైపుణ్యమును నీతితత్పరతను
రాజు గ్రహియించి యాశ్చర్యభాజుడయ్యు
కడిగె గన్నీట దత్పాదకంజములను

"కలవె పలు పల్కు, లిది నాల్క కాదె రాజ"
యని స్ఫుటమ్ముగ 'నకాలి' యనెను: తేను
వాల్చి తల యెత్తకయె లోన నగచి వగచి
పెదవి గదలింపకయె కాలు కదపి చనియె.

౪

అంతిపురమ్ములో ప్రభుని
యాగమనమ్ము మొరాను చూచి క
ర్ణాంతవిశాలనేత్రయుగ
ళాంచితకోణములన్ దృశించి వి
భ్రాంతిని గూర్చు సోలికల
వాలికలన్ గలహంసయాన నా
ట్యాంతరమోహసాధనల
నాత్మవిభున్ దరియంగ వచ్చినన్

పరిచితమౌ ప్రసన్నతలు
బంధుర మోహిత కామిలీల లాం
తరము కరంగి పొంగిపడు
తన్మయ ఫేనము లేని నేడు భూ
వరుని మెడన్ గనంబడవు
పాలిన మోమున వ్రేలుచుండె భీ
కర పరితాప మేఘ ఫల
కచ్ఛపు లెన్నియొ నీలనీలముల్

ఏడను శూన్యమే కను ధ
రేశుని అంధకదృష్టి కిట్టి క్రీ
నీడలు గానవచ్చునె ? గ
ణించు నతం డెవియో విషాదపున్
జాడలు, చూచి చూచి 'లల
నా' యనె: నాపె 'ప్రభూ' యటంచు
మాటాడిన దే మెరుంగక ధ
రాధిపు మార్పున కాత్మ గుందుచున్

 

"రణజితసింహభూధవుని
రాణ తొలంగినదే మొరాన! ని
న్నెనసిన దోష మెంతవల
కేచిన; చెల్లి సభాంగణాన నే
వినయవినమ్రదేహినయి
విన్నపముల్ వచియించి సర్వభూ
జను లిడు శిక్ష కొప్పుకొని
సాగిలి మ్రొక్కవలెన్ అభాగ్యుడన్"

భూమిధవు డిట్లు పలుక నా పొలతిమిన్న
గుండియల సమ్మెటలవ్రేట్లు కోటి పడిన
గతి హఠాద్దుఃఖమయియయి కాంతుతోడ
ననియె "ప్రాణపతీ! దీని యర్థ మేమి"

"మతధర్మమ్ముల కేను దప్పితిని నిన్
మన్నించి చేబట్టి- 'భూ
పతి యీ రీతి చరించినందులకు నో
ర్వన్ లేము శిక్షుంతు' ఘం

చలిరోపమ్మున నుండిరే ప్రజలు నా
యం దోచెలీ, నన్ను బం
ధితు గావింతురో - ఏమి చేయుదురో నా
తీ, - యింతకున్ వచ్చనే ''

'' ఓ సకలభూమిపాలాగ్రణీ! సమస్త
శత్రుమదగజకేసరీ! సర్వజనమ
నశ్చకోరశశీ! ............ ''

'' చాలును చాలు చాలు ... అవి
సత్యములే యగుగాక! వార లీ
వేలిక నిట్టులే పొగిడి
రెన్నియొ మారులు, కాని నేడు నా
పై లయకాలరుద్రులయి
పాడరు నీవలె : కీర్తు లెన్నియున్
జాలవు నేటి తప్పిదము
సన్నిధిలో : అవి లెక్కలేనివే ''

" అకట! రాజ! మహారాజ! సకలజనులు
నిన్ను నిలబెట్టి సభలోన చిన్నబుచ్చి
శిక్ష విధియింతురే పాపచిత్తులగుచు? "
" అగు నవశ్యము, తప్ప దియ్యది పథంతి "

" ఎట్టి దండన మిత్తురో యేమొ భూప "
" ముందు వచియింప జాలనే ముగుద నేను "
" వార లెల్ల మొరానును వదలు మనుచు
నైక్యకంఠాన బలుకుచో నపుడు...... "

అనుచు నర్థోక్తిగా నామె యడిగినట్టి
ప్రశ్న కుత్తర మీయ జాలక క్షణమ్ము
గాఢనిశ్శబ్దుడగుచు హృత్కందరమున
వెతకువాడు లభింప దే విధముగాని

కనుల స్రవింప బాష్పములు
కామిని శోకము భోరుకొల్పగా
జనపతి మానమున్ విడిచి
" చాన! భవత్ప్రణయస్రవంతిలో

మునిగితి: దివ్యసుందరము
మోహనమున్ భవదీయరూపవ
హ్నిని బడి లీనమైతిని గ
దే! ఒక పుర్వుగ విప్పి రెక్కలన్

నీ సరళంపు జీవితఘృ
ణీపరిణాహము నడ్డగించు నే
యే సుడిగట్టునైన సమ
యించెద; కాని, ప్రజాళి చెంగటన్
నా సకలప్రభాపటలి
నట్టువడున్ గదె! వారి నాలుకల్
నా సుషిమప్రమోదమక
రందకణమ్ముల నెగ్గు లాడునే!"

అన విని మొరాను నగచుచు నడిగె నెదిరియె
ప్రభువు పల్కెత్తలేదు మొరాను కిన్క
తోడ కెందమ్మికన్గవతో ట్రుచూపు
రణజితునిపైన బరపి పల్కంగ దొడగె

"దయయు దాక్షిణ్యమును మీ మతమ్ములోన
దలచుట మహాపరాధమా ధరణినాథ!
ప్రేమ మెరుగని దారుణభీకరోగ్ర
వజ్రములు రాజ! మీ స్వభావమ్ము లయ్యె!"

"కావలె నందువా యిపుడు
కామిని నా హృదయప్రసూనమున్
బావకు వ్రేల్చి అందు బడ
వైచెద – చెప్పుము – పల్కవేమి? నీ
వే విధి నా స్వభావమున
కింత కళంకము దెచ్చిపెట్టెదే?
నా వదనమ్ము గాంచుము క
నంబడు నీకె మదాత్మవేదనల్"

అని తన గోల జెప్పుకొను
నా ప్రభుసన్నిధిలోన నాపె భో
రున గళ మెత్తి గుండియల
లో మొగ ముంచుక నెంత యేడ్చినన్

కనికర మింత లే దతడు
కర్కశుడే యగు నేమొ,- ఏడ్వగా
జన దని యేని డగ్గఱ డ
చంచలుడై చనె భూపు డిస్సిరో

౫

అమృతసర మది శిక్కు-రాజ్యంపు నగరి
అచటి గురుపీఠిచెంత నా డఖిలజనుల
దృష్టి నెలకొన్న, దేమి విధింపబడునొ
పుడమిజేనికి - అత డేమి నుడువగలడొ-

జేడు వినమ్రుడై శిరము
వ్రేలగ వైచి సమస్తసభ్యులకు
జూడ సభాముఖాన నొక
చోటున నిందితుడట్లు నిల్చె, సాం

పోడిన రాజుతో బలుక
నొక్కనికిఁ మనసొప్ప, దప్పఁ డె
వ్వాఁ డొ వితర్ది పై కెగసి
'పల్కుకు' డంచు బ్రబోధసేయుచుఁ

కరయుగ మెత్తి నెల్లయెడ
గమ్మన నిశ్చలశాంతి బర్వె సు
స్థిరుడగు నాత డౌను పుల
సింహుఁడె - భూపుని చూచి చూచి 'ని

బ్బరముగ నిల్తు వెవ్వరవు
పల్కు' మనఁ - 'రణజిత్తుడఁ మహీ
వరుడ' ననంగ - 'నియ్యెడకు
వచ్చితి వెందుకు చెప్పు' మం చనెఁ

ఔర విధీ! భవచ్చటుల
యానములోఁగల అర్ధ మేమొ? దు
ర్వారపరాక్రమక్రమవి
భాసితు నొక్కని జేసి వానినే

పేరుప్రతిష్ఠ లేని యొక
బిచ్చపుకూళగ మార్చినైతు, వె
వ్వారలు నిన్ను గా దనెశి
వారలు వింతలు సుమ్మ నీ పనుల్

ఎవని కత్తి పఠానుల కవచములను
దూరి నిత్యాసృగభిషేకతుష్టి నొందె
ఎవని ప్రతిభాపతాక మి న్నెక్కి యాడె
అతడు ప్రాంజలియౌచు 'నిందితుడ' ననియె

"నీదు దోష మ్మదేమి రంజితుడ తెల్పు"
మనగ "పెండ్లాడితిని పణ్యావనిత" ననియె
"కలదె ముందొక భార్య సత్కులజ ?" యనిన
"కల" దనియె రాజు సిగ్గుతో నలిగి నలిగి

"మతవిరుద్ధము మోహదూషితమునైన
పరిణయము లాడ వలదని పలికినావె
నీవు మున్నెన్నడేని రంజితుడ" యనిన
"పలికి యుంటి" ననె రాజు కలగి కలగి

" ధర్మములు చెప్పి నీవె యీ తప్పుచేల ?
ఇటకు రానేల? " యనగ - "ఆ నటిని జూడ
ఓర్మి పోయెను, వచ్చి నిల్చుంటి నిచట
శిక్ష కోస" మ్మనెా రాజు చివికి చివికి

" అనుభవించెదవా శిక్ష? " యనగ నతడు
" తప్ప " దనె రాజు సర్వసిద్ధముగ నిలచి,-
కూడి రప్పుడు జననాయకులు రహస్య
భాషణము లాడ నేకాంతపార్శ్వమందు

అట ననంతమ్ముగా నుండినట్టి ప్రజలు
చెవులు నిక్కించుకొని పైకి శిరము లెత్తి
తీక్ష్ణముగ జూతు రవనీశు దిక్కు నెట్టి
శిక్ష విధియింతురో విన సిద్ధులగుచు

అపు డా అకాలి పులసింహు డగ్రపీఠ
మెక్కి 'సిశ్శబ్ద' మని ప్రజ దిక్కు చూచి
సద్దు మణగి సభఁ శాంతి సమకొనంగ
నవనిపునివైపు వ్రేల్ జూపి యనియె నిటుల

" నిందితుడయ్యె మీ ధరణీ
నేత యితండు సమస్త రాజ్యమం
దందటి ప్రాణమానవిజ
యాభ్యుదయమ్ములు వీని హస్తమున్
బొంది వసించు గాన జన
పోషకు డీతడు రాష్ట్రమందు నే
తుందుడు కుప్పతిల్లినను
దోషి యితండని చెప్పగావలెన్

ఈతని వర్తనమ్ము జను
లెల్లరు చూతురు వీనియట్లె పో
జూతురు వారలున్ - కనుక
చోదకు డీతడు తప్పుత్రోవలన్
నీతికి దూరుడై చనుట
నెమ్మది కాదు ప్రజాశయమ్మునం
దీత డలక్ష్యభావమున
నేగిన క్షేమము లేదు వీనికిన్

మిమ్ము దృణీకరించి తన
మేరను దాటి వాతప్రబోధముల్
వమ్ముగ జేసి కట్టుకొనె
వారలతాంగి నొకర్తు నిట్టి దో
షమ్ము నొసర్చి సిగ్గిలి వి
చారముతో గనువాడు చూతురే
యిమ్మహిపుండు ! వీని కిపు
డీయవలెన్ తగు శిక్షనే కదా"

అన విని సభ్యు లెల్లరు జ
యధ్వని రేపుచు 'శిక్ష శిక్ష' యం
చనిరి ధరేశపాదయుగ
ళాధరభూస్థలి బ్రద్దలై 'ధణం
ధణ' యని యన్న మాద్రిగ న
తండు మనమ్మున కంప మొందె దం
డన మది మృత్యుగర్జగ వి
నంబడు నేదియొ యంచు గుందుచున్

చెయి నెత్తైను పులసింహుడు
జయరావము లాపి జనులు శాంతులు గాగన్
నియమితదండన మాతడు
రయమున వినిపింప దొడగె ప్రభునకు ప్రజకున్

•

" ఈ గురుపీఠిచెంత కెవ
రెవ్వరు పెద్దలు చిన్న లేసియున్
రాగలవారొ ప్రత్యహము
నన్ గురుసేవకు వారు వార లిం
దీగుచు ద్వారమందు నెడ
యించెడి చెప్పుల జోళ్ల ధూళి పో
బా గొనరింప గావలెను
పార్థివు డిర్వదియొక్క నాళులున్

తానె పలుదోము పుల్లలు తగినవాని
వెతకి కొనివచ్చి యిచ్చుచు విసుగు లేక
అన్ని దినములు నవ్వారి నవనిపాలు
డుదయవేళల సేవించుచుండవలయు

గురుపీఠమునకు వసుధా
వశు డొక లక్షయును పైన పాతిక వేలున్
విరళము నీయగ వలయును
గురుభక్తికి చిహ్నముగ నకుంఠితమతివై

ఇవియు గాక నిం కొక్కటి యవనిపతికి
శిక్ష కల దద్ది విను - డొక్క చెట్టు మొదలు
నకు బ్రభుని కట్టివైచి నూటొకటి వరకు
దెబ్బలను గొట్టెద రతండు తినవలయును

జనపతి కిట్టి శిక్ష నిడ
సమ్మతమే జనులార మీ" కటం
చనె బులసింహు - డెల్ల ప్రజ
'లా' నని బల్కిరి భూమిపాలకుం
డనుమతి నిచ్చె "నింక తడ
వయ్యది యేల? తొలంగజేయు డా
తనిపయి నున్న గుడ్డ" లని
తాలిమి తూలి వచించి రా ప్రజల్

 ఘోరాకన్య

రణజితుగుండెపై పిడుగు
రాలినయట్లు కాఱుచీకటుల్
మునుకొని నల్గడల్ బలసి
పోయిన యట్లు ప్రాణమానముల్
తనను తొలంగినట్లు పగ
తాపవితానని తాంతదారుణ
ప్రణితుడగుచు తదాజ్ఞయు క్ష
వఃపుటిలోన బ్రతిధ్వనించెను

పులసింహు డటు లన్న పల్కు లవి యే
వో సభ్యులం దృప్తిసే
య లపింపంబడె నంచు భూమిపతి యూ
హల్ సేసె గానీ - యిటుల్
నిలువందీతురటంచు పాప మత
డే నిశ్వాసమం దేనియుం
దలచం లే దిదె స్వప్నమం దయిన బ్రా
ణ మ్మప్పుడే పోవదే!

చెదరిన గుండెతో ప్రభువు
చేయున దేమియు లేక మెల్లగా
వదలిచి నైచె పైని గల
వస్త్రము, లప్పు డొకండు సేవకుం
డదరుచు వచ్చి భూమిపతి
నచ్చటి చెట్టుకు గట్టివైచి కే
ల దురుసుబెత్త మొందు గొని
లజ్జితు డానకు వేచి యున్నెడన్

దీనమ్మైన ధరాధినాయకుని మూ
ర్తిం జూచినా రెల్లవా
రా నైరాశ్యము జూడ లేక హృదయా
యఃపిండముల్ నీరుగా
మౌన మ్మూనిరి పల్కనేర రెదుటన్
భ్రామ్యద్ఘ పాంచాలప
ద్వీనాథాంచిత హేమదేహమున మో
దెన్ సేవకుం డప్పుడే

పడియె నొక దెబ్బ, ఎవ్వరు పలుకలేదు
పడిన దంతట రెండవ ప్రహరణమ్మౌ
ప్రజల కన్నులు బాష్పస్రవంతులయ్యె
రాతిగుండెలె కరుణార్ఘురమ్ము లొలికె

మూడవసారి సేవకుఁడు
మోదుట కెత్తెను బెత్త; మెల్ల హృ
న్నీడములన్ గృపావిహగ
నిస్తులవేదన లుప్పతిల్లె - వి
న్నాడు అకాలి - ఆగు మని
నాడు - భటుండు బెత్తమున్
తోడన దించె సభ్యుల ప్ర
మోద మదెంతయొ చెప్పలే మికన్

మిగుల నాసక్తిశ్రద్ధయున్ మొగములందు
చిందుచుండ ప్రజల్ పులసింహు డేమి
బలుకు వాడొ యటంచు నిశ్చలితులైరి
అదను గ్రహియించి అతడు మాటాడ దొడగె

"జనులారా! మరలన్ భటుండు ధరణీ
శస్వర్ణదేహాన దె
బ్బను దాకించెడి పూర్వ మొక్క నుడి చె
ప్పన్ గోర్కె నాకున్న దీ
జనపాలాగ్రణి నిందితుం డగుటయున్
సత్యమ్మె యూ గాక భూ
మిని పాలించుటలోన దక్షు డెపుడున్
మీ మేలుకై కంట వ
త్తిని చేగత్తిని బెట్టి పట్టుకొనె మి
త్తిన్ గాని లెక్కించెనే?

అరివర్గమ్ములు వీని పేరు విని సిం
హ స్వప్న మైనట్లు బం
ధుర భీతిభ్రమచింత లావరిలగా
దూరమ్ము దూరమ్ముపో
దురు పాంచాలము దాక గల్గుచురె మీ
తొల్లింటి పున్నెంపు పం
ట రహించున్ రణజిత్స్వరూపమున దై
న్యమ్మూడె నే డాతడే

ఎవని కత్తి పఠానుల కవచములను
దూరి నిత్యాసృగభిషేక తుష్టినొందె
ఎవని ప్రతిభాపతాక మిన్నెక్కి యాడె
అతడు ప్రాంజలి యాచు నిందితుడ ననియె

ఆ కేసరి ప్రాణమ్ముల
కీ కర్కశబాధ లెంత హీనమ్ములొకో
అకృతజ్ఞులమై మన విభు
బోకారుచు కొనుట తగని బుద్ధిగ దలతున్

అనుటె తడవుగ సభ్యు లాహ్లాదభరిత
హృదయపూరతరంగితవృత్తులైరి
'జయము రణజిత్ ప్రభో నీకు జయము జయము
జయము పాంచాలకేసరీ జయము' అనిరి

కట్లు విడిపోయె జేనికి కనులవెంట
బాష్పముల పోత ఆగని వరద యయ్యె
జనులముందు వితర్దిపై జనవిభుండు
నిలిచి "ప్రజలార నన్ను మన్నింపు" డనియె

*　　*　　*

*　　*

ఇది మరువరాని జాతీయహృదయఘనత
జాటిజెప్పెడి భారతచరితలోన
మాసిపోవని ఘట్టమ్ము : మహిమ లిట్టి
శక్తి గురుతించి మెలగుట సర్వశుభము

*　　*

*　　*　　*



శ్రీ బాలా త్రిపుర సుందరీ ప్రెస్, జనరల్ బజారు, సికింద్రాబాద్.
మొదటి ముద్రణ : ౨౦౦

